వ్యాసదాసుడని నామాంతరముగల క్షేమేంద్రమహాకవి యీ సేవ్యసేవకోపదేశమును సంస్కృతమున రచించినాఁడు. అతఁడు ౧౧-వ శతాబ్దివాఁడు. కాశ్మీరదేశీయుఁడు. మంత్రికులమువాఁడు. సంస్కృతమున నాతఁడు ముప్పదిగ్రంథముల రచించెను. వానిలోఁ గొన్ని విమర్శగ్రంథములు. అవి ఔచిత్యవిచారచర్చ, దేశోపదేశము, సువృత్తతిలకము, మొదలగునవి. భారతమంజరి, రామాయణమంజరి, బృహత్కథామంజరి, మొదలగునవి యితిహాస కథాగ్రంథములు. ఔచిత్యవిచారచర్చయం దీతఁ డితరులనేకాక తన్నుఁగూడ విమర్శించుకొని దోషములఁ గణించుకొన్నాఁడు. క్షేమేంద్రుని స్వాతంత్ర్యప్రియత్వము నీచిన్నగ్రంథము ప్రకటించుచున్నది. ఇం దాతఁడు సేవకుల సంకటములను ధౌర్త్యములను జక్కఁగా [illegible]ంచినాఁడు. సేవ్యులకును జక్కనిమందలింపు లున్నవి. పుస్తకము చిన్నదైనను, లోకవృత్తమును జక్కఁ దెలుపుచునదిగా నున్నది గాన ప్రియపడి తెనిఁగించితిని. 9-37 శ్లోకములు తెలిఁగింపలేదు. అవి సరిగాఁ దోఁపలేదు. తప్పుల మన్నింప విద్వాంసుల వేఁడుచున్నాను.

జయంతిపురము
29-1-1925 } వాసిరెడ్డి దుర్గా సదాశివేశ్వర ప్రసాద్.

# సేవ్య సేవకోపదేశము

(క్షేమేంద్రుని సంస్కృతకృతికిఁ దెనుఁగు)

—:o:—

రోషణమయి దుస్తృష్ణా
శేషతమోమోషణమయి సేవావిషసం
శోషణమయి యెప్పుడు సం
తోషలసన్మణికి నే నిదో ప్రణమిలుదున్.

గీ. కష్టజీవులఁ బాడగాంచి కంటఁ దడిని
బెట్టి నిజకార్యములఁ బెడవెట్టియైనఁ
జేయుఁడా! సేవ్యసేవక సేవలకును
జగతి సజ్జనవరు లనుశాసనంబు.

గీ. దర్పముననొక్కఁ డింక లోభ్యమున నొకఁడు
సేవ్యసేవకు లిరుగురు జీర్ణదృష్టు
లగుట ధనగర్వవికృతిని నార్తివికృతి
నారయఁగనేర రన్యోన్య మానసముల.

మ. అనివార్యంబుగ లోభమోహములచే
నంధుండు గాఁడేని యే
జనుఁ డీధారుణి నిల్వ జీతములతో
సత్త్వంబు గోల్పోయి దు

ర్థినయాక్రాంతము రోషదూషితము స
ద్విజ్ఞానదూరంబు నా
ధనియాస్యంబును దేవరించుకొనుచుఁ
దాఁ జూడ నాసించునో!

గీ. గర్వపటలంబు గన్నులఁ గ్రమ్ముకొనఁగ
మ్రోలఁ గల నేలనుం జూడఁజాలనట్టి
వాఁడు దారిద్ర్యదోషంబువలన లాఘ
వంబు గాంచినవాని సేవకునిఁ గనునె?

గీ. కుంటియుంబోలె మోయించుకొను నొకండు
వినుతిసేయును జెవిటిని వేఱొకండు
సేవ్యసేవకు లిర్వురు సిగ్గుమాలి
హాస్యమున కర్గమగుచుండు రవనియందు.

గీ. ఎపుడు హుంకృతిమాత్ర విస్పష్టుఁడగుచు
దూరమునఁ బడు మఱి గుణదూరుఁడగును
తప్పిపడ్డబాణమువోలెఁ జప్పఁబడును
నిష్క్రియుండగు భృత్యుండు నెళవుగనఁడు.

క. ధరసేవాపంకమునం
జోరఁబడని వివేకి తొల్లి సుస్థిరతపమున్
సురతటినీతీరమునో
హరవనములఁ జేసియుండునా? యనుకొందుఁ.

గీ. కడఁగి యెవఁడు సేవాసంకకర్మలముగఁ
దనతలను జేసికొనకుండు ననువుగల్గి
అతఁడు దైన్యవిదూరుండు నతఁడు సుకృతి
క్రాలు నాతనియశము దిక్తటములందు.

గీ. ఏలికకు భక్తితో మ్రొక్కు లిడెడునపుడు
దైన్యమూలము కుక్షి ప్రదర్శనంబు
చేయుచును మెల్ల లోఁజొచ్చి సేవకుండు
కొంకుచును జంకు చిలఁ జూచుకొనుచు నిలుచు.

గీ. దాస్యకేతువై యంజలి తలనుగలుగ
నెదను దైన్యము సంస్తుతుల్ వదనమునఁగు
నాను నాశాగ్రహగ్రస్తు లైనవారి
కక్కటా యెట్టియగచాట్లఁ జిక్కుటయయొ.

గీ. అక్రమముగ నకాలమం దదరు లుమిసి
నష్టిగూర్చు నీశ్వరుకోపదృష్టివలనఁ
బ్రాభవంబెల్ల భస్మమై పాడుగాఁగ
సేవకుఁడు చిత్తజుఁడువోలెఁ జేటుఁ గాంచు.

గీ. వాహినిఁ బ్రవిష్టుఁడై ఖడ్గపాత్రముగను
దనువు నర్పించు నెవ్వఁడు త్యాగియగుచు
మరల నాతండు క్లేశావమానములకు
స్థానమగు సేవలకును భాజనము గాఁడు.

క. తృణకణాద్రప్స్లేశం
బున సేవకచాతకంబు పొందును శోషం
బును దా నుద్గ్రీవముగా
ననిశ మెదుర్చూచుచుఁ ఘనాశాహతమై.

గీ. అపరితోషపిశాచి పై నావహింపఁ
దుష్టి గలిగించు బాటఁ బూఁదోఁట విడిచి
తేఁటిపోలెను భృత్యుఁ డర్థించి చనును
దాన లోభంబుచేత మాతంగసేవ.

గీ. జనుని సేవించి సేవించి బడలి బడలి
కొంగరీతిని హెచ్చుగా దొంగజపము
సల్పుచును సేవకుం డిల క్షణికమైన
లాలనకుఁ బాత్రమగు నెట్టకేల కింత.

గీ. ఉన్నతిని గోరి యత్నించుచుండి కూడ
మానభంగ పరానోయని మఱఁగునేని
సేవకతయందు మనుజుండు చెడుటనిజము
రెంటికిని జెడ్డ రేవని రీతిగాను.

గీ. అవనిపైఁ బడుకొనుచు నిరశనుఁడౌచు
శీతవాతాతపములకు స్థిరతఁ గనుచు
సేవకుఁడు మునివృత్తితోఁ జెలఁగికూడ
కడిఁది నరకంపుబాధలఁ గుడుచుచుండు.

గీ. భోగభాగ్యానుభవములపాలుపుగోలుపు
యౌవనం బంతరింపనియంతవఱకె
అంతులేకుండ నాసాస లందునట్లు
సేవలనుగూడఁ గావించుసేవకుండు.

చ. కరములు దోసి లొగ్గగను
గన్నులు ద్వారమువంకఁజూడఁగన్
శిరము నమస్కరింపఁగను
జిహ్వ నుతింపను నెల్ల వెంట నీ
కరణిఁ బరోపకారమునఁ
గాయము నర్పణచేసి దాస్యదు
ర్భరమగు పారతంత్ర్యపు దు
రర్థమునం బడు భృత్యుఁ డయ్యయో !

గీ. యాచనాదైన్యమునఁజేసి యల్పుఁడైన
సేవకుఁడు సేవ యనియెడు చెడ్డబురద
మడువునం బడి తికమకల్ గుడిచి యుడఁగు
నుద్ధరించెడుతోడు లేకుండుకతన.

గీ. ఎడతెఱపిలేక నిస్పృహా బడలుపఱుప
నిడుదయూర్పులు తనుబలం బడఁగఁద్రొక్క
వాడి వత్తలైయున్న సేవకుల కయయొ
వార్ధకమువోలె దాస్యంబు వంతఁగూర్చు.

ఆ. నలిగినట్టి తంతివలెఁ బుటుక్కునఁ దెగు
మ్లానమగును బుష్పమాలవోలె
సేవ మంచితనము స్థిరముగా నిల్వదు
ఎప్పుడో యొకప్డు తప్పిచెడును.

గీ. రాజవీథి నెండలఁ గాలి రోఁజువారి
కధిక సేవాకుపితగాత్రు లయినవారి
కెపుడుఁ దృష్ణావిషార్తిచే నీల్గువారి
కరయ శమవారిదముమూవె శరణ మవని.

గీ. ఆశవోలెను శూన్యమ్ములందునుండు
తృష్ణవోలె సంతోషవైరిత్వమూను
ఈడ్చుఁబాశమువోలె రేయింబగళ్లు
సేవదేవతలకుఁగూడఁ జింతఁగూర్చు.

చ. చెలఁగి నిసర్గవంధ్యమగు
సేవ నెవండు ఫలాభిలాషతో
నలుపఁదొడంగునో యతఁడు
సత్యము కుంచెటికొమ్ముతోడ స్వ
స్థలమును గ్రుళ్లగించి బహు
థాకృషి కృత్యము సేయఁజూచు వెం
గలియయగుక్, దుదింబడయఁ
గల్గెడు లాభము రిత్తక్షోభమే.

గీ. ఆత్మచింతనానందంబు నందలేక
సేవలంజిక్కి ప్రయత్నములు సేయువారు
పాలమున్నీటి పెన్నీటి పజ్జనుండి
తృష్ణపాలయి యిట్టటుఁ దిరుగువారు.

శా. గంగాతీరవనాంతరమ్ములు సమగ్ర
స్ఫీత నానాఫలో
త్తుంగానేక మహాతరు ప్రకరజా
తుల్ గల్గి క్షుత్తృడ్వ్యథా
సంగంబుం గడతేర్పఁగా వెలయ ని
చ్చల్ దేనికో దైన్యముం
భంగమ్ముం వ్యసనమ్ముఁ గూర్చు శఠసే
వన్ లోకమేఁ కోరెదుర్.

గీ. తీవ్రమగు విషయేచ్ఛను దిగనడంచి,
తోషపోషహా కుశల మందుకొనుమనుచు
కడఁగి సుఖసేవకై యాత్మ నడిగికొనఁగ
నదియె సమకూర్చు నరులకు నఖిలసుఖము.

గీ. చలికిఁ జీకటి కెండవానలకు దైన్య
మునకుఁ జింతకుఁ దను వెల్ల ముద్దగాఁగ
సౌఖ్యమోహంబుఁగొని మూర్ఖజనుఁడు సేవఁ
జేయు దుఃఖసహస్రంబుఁ జెందుచుండి.

గీ. సతముజరుపును దాస్యంబు వ్రతమువలెనె
ఎల్లచో జీవితవినాశ మెన్నుకొనును
ద్వారపాలకుల్ పొమ్మని తఱిమి తన్న
నను జనఁడు యాచకుండు వినష్టగుణుఁడు.

ఉ. పోవుచు వచ్చుచున్ గడపి
పుచ్చితి నాళుల నెన్నినాళ్లకా
భూవిభుఁజూడఁగా నదను
పుట్టక పోయెనటంచు దుఃఖభా
రావిలచిత్తుఁడై వగపు
లందుచు భృత్యుఁడె జీర్ణదేహుఁడై
పోవునుగాని వానిమదిఁ
బాంగెడు తృష్ణ తఱుయింప దింతయున్.

చ. పిలువని పేరఁటమ్ముగఁ బ్ర
వేశము గాంచుచుఁ బట్టుగానిప
ట్టుల వెలుగొందు దివ్వియ య
టుల్ చెడఁగొట్టుచు నేకతంబులన్
వలువకులోపలంబడియ
వస్థ ఘటించెడు నీఁగమాడ్కిఁగాఁ
దలఁపడు భృత్యుఁ డేవిభుని
దగ్గఱనేనియు గర్వ్యుఁడేకదా.

గి. కనులనులుకించుఁ బాగఁవోలె గానఁబడుచు
చాటుగాథలఁ జెవులకు జ్వరముఁగూర్చు
ఎడప కడుగడ్డునకుఁ గానఁబడుచు ముల్లు
వలెను దుస్సేవకుఁడు విభు నలఁచుచుండు.

గీ. ఒకఁడు దివిఁజూచుఁ జూచు నింకొకఁడు భువిని
ఒకఁడు నిర్జనార్థియు మఱియొకఁడు గాఢ
సక్తుఁ డిట్లుండఁగా నెట్లు సాగఁగలదు
సేవ్యుఁడొకఁడై మఱొక్కఁడు సేవకుఁడయి

చ. కడఁగిసరూపుఁడైన శని
గాని విధంబున వెంబడించుచుఞ్
జెడుగులు గూర్చుచుఞ్ హితముఁ
జెర్చుచు వృశ్చికనిశ్చలుండునై
కటుముద మూనుచో నడుమ
గడ్డయుఁబోలె నకాలపాతియై
యొడయని కెంతయేని యవ
యోగము గూర్చుఁ గుసేవకుం డిలఞ్.

గీ. త్రోపు వడియును బోఁడు తీవ్రోపరోధ
పరిచితుఁడు జడభృత్యుండు ప్రభునిదయకుఁ
బాత్రతను గాంచఁ బలుపాట్లు పడుచునుండు
నదియె ప్రభుకోపకారణ మగు టెఱుఁగఁడు.

గీ. అస్సురుసురంచు నిట్టూర్పు లార్చుకొనుచుఁ
దనసమాగమన ప్రయాసను దెలుపుచు,
యాచకుఁ డతిప్రవేశదోషాచరణుఁడు,
రిత్తగూలును మార్గణ రీతిదోఁప.

ఉ. శ్రీమణి చంద్రధేనుహయ
సింధురబంధుర సంపదున్నతిన్
క్షేమముగన్న రాజకుల
సింధువుఁ గన్గొని యీశ్వరత్వమున్
బ్రాముకొనందలంచి మతి
మాలినభృత్యుఁడు స్వీకరించెడున్
భూమిప సేవనంబనెడు
భూరిమహోజ్జ్వల కాలకూటమున్.

గీ. "విడుము విడుమోయి పాంథుఁడా విఱుగవంగఁ
గాచినరసాలమిదిగాదు ఖదిరమచుమి
నిష్ఫలం"బని యితరు లనినను గూడ
నాశచే దుష్ప్రభుని విడనాడఁ డర్థి.

ఉ. మాల తెఱంగునన్ మరల
మార్దవమందదు వాడువాఱినన్
ప్రీలిన నింక సంధిలదు
వేర్పడిపోవును గాజుమాడ్కిఁగాఁ

జాలని బీదయింటి దివె
    చాటున వైన్యపు టూర్పుగాడ్పులన్
గాలును స్నేహసౌఖ్యమయి
    కుత్సిత సేవ పాసంగఁ ద్రోచినన్.

ఉ. ఎవ్వఁడ వేఁగె మెచ్చుటికి?
    భృత్యుఁడ నే, నృపదర్శనార్థ మై;
క్రొవ్విసలాభ మేమి యట?
    కల్లును దన్నులు తాపు; లయ్యో! యా
నొవ్వికి మన్నుఁబూసెదె? క
    నుంగొస రాదట మాదు త్రొక్కుడిన్
దువ్వయుఁ; జాలు నా సఖుఁడ!
    దుష్ప్రభుఁడా! పదివేలుదండముల్!

మ. ముకుద్రాపం దలపించునట్టిదయి పెన్
    మోహాంపు వైన్యంపుఁ దా
నకమై సేవకతా శ్రమమ్ము కపుఁజెం
    తంగూర్పఁగా విత్తలే
శక్ర తాపేతును సైఁచెపున్ మనుజుఁ డెం
    చన్ రత్నముక్తాదిల
బ్ధికి యాదో బడబాగ్ని భీకరము న
    బ్ధిన్ జొచ్చుటిల్లేకదా!

ఉ. ఊరక రాకపోకల స
ముద్యతుఁడై వెతలందు, మందిర
ద్వారముఁ జూచుచున్ నిలుచుఁ,
దా భటపాళి నిరస్యమానుఁడై
ఘోరపుయత్నమున్ జలిపి
కొండొక లోఁజని దూషితుండగున్
పేరిమిదక్కి కుక్కవలెఁ
బెన్వెత లందుఁ గుసేవకుం డిలన్.

సీ. మ్రోయఁగాఁ దలుపులు ద్రోయుటచేతను,
నత్యంతమును గుపితాత్ములగుచు
నెత్తిపై నెడనెడ మొత్తుచుఁ దలుపులు,
దెఱవకు పొమ్మంచుఁ దీవరించి
ద్వారపాలకులు దుర్వార బాహుబలుల్ ని
వారింపఁగాఁ జింతవంతఁ జిక్కి
చీకాకుఁ జెంది కుబ్జీభూతుఁడై వారి
కాళ్ల సందుననుండి యల్లనల్ల
గీ. లోనికిం జొరఁబాఱి కాలూనకుండ
నిలిచి వాయెత్తకుండఁ దా వెలికివచ్చు
వారలను రాజదర్శనా వసరమడుగు
నయ్యయో! యాచకున కెన్నియటతటములు.

ఉ. వాకిట నడ్డఁబడ్డఁ గని
    వద్దనఁ జెట్టులా చేర రా సమా
లోకముచేయఁ డేమనవు
    లున్ గజమీలితముల్ పొనర్చుచున్
గైకొనఁ డేఁగినన్ వెదకు
    గంపెఁడుతప్పులు, తప్పులందుఁ గా
లాకృతియౌఁ బిశాచమున
    కాతని కేమిట భేదమో కదా!

చ. గురులను రాజపూరుషులఁ
    గొల్వఁడు కొల్చును రాజదాసులన్
వరదుఁ దలంపఁ డీశ్వరుని
    వారక విత్తమునే తలంచెడున్
నరపతి కీడుమేళ్లను గ
    నండు స్వకార్యములే కనుంగొనున్
జెఱుచుఁ జెడున్ గడున్ జడుఁడు
    సేవకుఁ డెప్పుడు శ్రీనిమిత్తమై.

ఉ. చేరరు గోఁతఁగూల్చువిష
    చిత్తులు మత్తులు, చాటదుమ్మునన్
గూరదు నీమొగమ్ము, వెను
    గోలయు నుండదు, ద్వారపాలదో

ఉ. ఈ స్సారపుభీతి కగ్గదికఁ
జప్పనఁ జేరుము పుణ్యకానన
ద్వారము; మూఢుఁడా! యచట
దంభనృపాలురఁ బాధ లేదురా.

శా. అన్నా! కష్టవినష్ట! సేవకుఁడ! పో
షాశన్ మహాయాసమున్
గన్నా, వో, నయమో నపుంసకునిరా
గద్వేషదోషార్తిదున్
మన్నిన్ భజియింతువే పరతరున్
మాహేశ్వరున్ గొల్వు మా
పన్నత్రాణపరాయణుం డతఁడునిన్
బాలించు నెల్లప్పుడున్.

గీ. జ్ఞాతలేశుల యవివేకకారణమున
వెలయు దైన్యంబు లెన్నగా విడుఁడు సుమతు
లెద భవగ్రంథి నీఁక జనియింపనీక
దివ్యవిజ్ఞానమణిఁ గొల్చి భవ్యు లగుఁడు.

సీ. వ్యాజంబులకు నిత్య మావాసమగువారు
విజనసుఖేచ్ఛులై వెలయువారు
వసుధేశ్వరులు వారిఁ బడిఁ బంచలం బడి
యూడిగం బొనరించు టుడుగుఁ డింక

త్రెంపుడీ యాశాఖ్యదృఢపాశబంధగ
చిత్తంబు నెంతయుఁ జిక్కఁ బట్టి
విమలంబు పూతంబు శమజలంబును జల్లి
యార్పుఁడీ తీవ్రతృష్ణానలంబు
గీ. హృదయకుహరాంతరాంధ్యంబు చెదరఁగొట్టఁ,
జాలుపరమామృతజ్యోతిఁ గీలుకొలిపి
నిర్వికల్పసమాధిలో నెగడి మీరు
శుద్ధసౌఖ్యప్రపంచంబుఁ జూడుఁడయ్య!
గీ. వృత్తిచేతనె జగము జీవించు; నిజము,
పరికొ కొందఱకె సేవ వృత్తియగును
దాస్య మాస్థానమునఁ దీవ్రతర మగుటను
వెగడుఁడీ దానిఁ బ్రాజ్ఞులు తెగువమీఱ.
గీ. పండితులఁ గొల్వ మక్కువపడెడువాఁడు
తోష సేవారసాంబుధిఁ దోఁగువాఁడు
వెలఁగి క్షేమేంద్రుఁడనువాఁడు చెప్పెదీని
బుద్ధిమంతులు సౌఖ్యంబు పొందుకొఱకు.
గీ. దేశమెల్లను దాస్యంపుఁ దెవులుచేతఁ
గూలు నీకాలమున నిది మేల్కొల్పు
నని యథాశక్తిగాఁ దెలుంగునను దినిఁ,
జెప్పినాఁడ మన్నింపుఁడీ తప్పిదములు.

---